# నదీసుందరి.

[ ఏకాంక రూపకము ]



సూత్రధారుఁడు

రసపిపాసిని నేను పారమ్ము లేని
గగనవీథీ విశాలరంగములయందు
లందఁగారాని తలపుల తంపమైన
రూపములు దిద్ది క్రీడింతు రూపసరసి ॥

తెనుఁగు సీమలలో నాట్యలోలయగుచు
ప్రాజ్యశ్రీపుష్టి వర్థిల్లు ప్రాంతలోన
ప్రియతమములైన వలపుకోరికలతోడ
నందిలంబమ్ము శ్యామల గగనవీథి ॥

ఎన్నఁడో పూలుపూచె నాహృదయసీమ
కెంపుచివురుల కావేరి కీర్తిలతిక,
ఎన్నఁడో జీవనోద్యాన హృద్యవాటి
కెరలిపాడెను కావేరికీర్తిపికము ॥

బంధురంబు లైన యానాటి పరిమళములు
పొలుపును, గానములు గాల్చి పల్లవించి
యుగయుగాంతరవ్యాప్త వియోగభరము
మోయు, కావేరి సంపూర్ణమూర్తి దాల్చె॥

భావవిదులకు రసరాజ్యపాలకులకు
తొలువాలుల భక్తితోడ చేదోయి మోడ్చి
అభినవమ్ముగ రూపక మంధ్రభాష
నర్పణము సేయుచున్నాడ నందికొనుడు॥



## మొదటిరంగము.



అగస్త్యుడు

శృంగారవతీ! ఈ సుప్రభాతమున నెందుకీ తొందరపాటు? దేవపూజకై చిదిమిన పూవులు, పల్లవములు నేలపై రాలిపోయినవే! ఏటికి యిత్తునా?

శాంతి

నేను శాంతముగనే నడచుచున్నాను. నేలపాలైన పుష్పద్రవ్యములు దేవత లభిలషింపరు.

(నిష్క్రమించును)

అగస్త్యుడు

ఈ సుకుమారి గడుసుదనమునందెంత నాజూకు! అరవిచ్చిన సోగచూపులతో శిరీషకుసుమములు చెవికొనల నందగించి, వేణీకానీలములను తడికొనలలో జాఱుముడివైచి ఉదయవాయువులమధ్య వెనుకకు పరువులెత్తు పైటచెఱగులతో వనదేవతవలె నదే యదృశ్యమైనది! సంధ్యార్చనా సమయములందు ప్రేమకై పరి

తపించు నాసూనిహృదయము నావేశించిన నీమూర్తి యేనా ?

ఆ మోహనమూర్తిపై వియోగరేఖ యేమి ! సఖులతో కలిసి యాశ్రమవృక్షముల చక్కబెట్టు సమయమున నీ మునిపుత్రికను మొదట చూచితిని. ఆముఖమండలము జన్మాంతర వ్యథాభారమును మోయుచుండెను. ఆనాడే నాహృదయమున కీమె బాంధవియైనది. నావేదనలన్నియు నొక్కసారి మేల్కొనినవి.

ఉదయకాంతు లవిగో తపోవనవాటికలపై విశ్రమింప జొచ్చినవి. ఆ ప్రాంతమునందలి తమాలవృక్షముల చీకటినంతయు మ్రింగి పసిమిని మాత్రమే మిగిల్చినవి. కుసుమిత లతావళులన్నియు నానందమున తల లూచుచున్నవి. దూరమున పర్వతాగ్రములపై ప్రవ్వ శించిన యా భాద్రపద మేఘశకలము లెంత యుప్పొంగి యున్నవి ! భూర్జపత్రములపై పురాణపంక్తులు వల్లించి శుష్కమైన నా హృదయ మీప్రభాతమున క్రొత్త వేషము దాల్చినట్లయినది. నాయానందలతల కిది యాలవాలపూరణము.



## రెండవ రంగము.



(చారుశీల పూలపేటికగొని ప్రవేశించును.)

చారుశీల

నీలా! నీలా! (అని కావేరిని పిలుచును)

(చిత్రవింద ప్రవేశించును)

చారుశీల

ఎన్నాళ్ళకు వచ్చితివి? కులపతియాశీర్వచనము నొంది వచ్చినావా? చిత్రా!

చిత్రవింద

ఏదీ, యికపోవలె.

చారుశీల

రానేవచ్చితివి. కొంచెము నాకీపూలు కోసి పెట్టుదు.

చిత్రవింద

ఏవి? ఈ మందరములా? ఒత్తుగాపూయు నీ

కొమ్మలపై పూలన్నియు నెవ్వరు దోచుకొని పోయి నారో? ఒక్కటియు కనుపించదు.

చారుశీల

ఇంతవరకును ఆశ్రమవాటికయందే దేవమందిర మలంకరించుచుంటిని. సఖీ! కావేరి నేనే పోయివచ్చెద నని యొక్కతెయే పూలన్నియు కోసికొనివచ్చినది. మన కుటీరము నానుకొని మల్లెతీవ లేదు? దానిని ఆశ్రమ హారిణకము అకస్మాత్తుగా నల్లరిపిల్లయే దారి కష్టముగా లాగినది. పూలన్నియు తడిసిన తీవకుదిటిలో బడి మలినము లయినవి. అది కాళ్ళకుదగిలి కావేరిని నేలపై బడద్రోసినది. అందుకని పూలెక్కువ మిగిలి లేవు.

చిత్రవింద

అప్పునుగాని "నీలా" యని పిలిచినా వెవరిని?

చారుశీల

నిన్ను ముద్దుపేరుతో పిలిచితి ననుకొన్నావా?

చిత్రవింద

మరి యెవరీ యాగంతుకి?

చారుశీల

మన కావేరి.

చిత్రవింద

ఏమిటి ?

చారుశీల

మరచిపోయినావా ? ఆఁ నేనే మరచినది. నీవీ యాశ్రమమునుండి ప్రయాణమైనది ఆషాఢమాసమున కాదూ ?

చిత్రవింద

అవును. వెన్నెలదినములలో.

చారుశీల

నిన్ను వీడ్కొలిపినపుడు ధారుణీజనని యన్న మాటలుకూడ నాకు జ్ఞాపక మున్నవి. "చిత్రా! ఆషాఢ మాసముననే దిగివచ్చిన శ్రావణనీరదాంగనవలె నీ వారు నిన్ను గని యానందింతురు," కాదు?

చిత్రవింద

నిజమేకాని నీలావృత్తాంతమునకు బదులు చిత్రాప్రయాణమును వర్ణించుచున్నావు.

చారుశీల

అనగా, నీవు వెళ్లిన మూడు నెలలకు కావేరికి గొప్ప దుఃఖము వాటిల్లినది. ఒకనాడు సప్తవర్ణవృక్షముక్రింద కావేరి తదేకధ్యానముతో నేదో తిలకించుచు కూర్చుండెను.

చిత్రవింద

అంత దుఃఖము, అంత మానసికతపస్సు ఆ వయస్సునకే యెట్లలవడునదో?

చారుశీల

అంతలో యేనుగులగుంపువలె మేఘములు పరువులెత్తుచు ఆకాశమంతయు నాక్రమించెను. ఉరుములతో మెఱుపులతో రమణీయముగ వర్షలక్ష్మి యవతరించెను. కావేరిని గానక వెదకుచు తుదకు వర్షధారలు చీరచెఱగులబడి కాలువలు గట్టుచున్నను కదలక చెఱిగిన పాపటతో సగమువంచిన కనుఱెప్పలతో నిశ్చలమైయున్న తనయను 'నీలా! నీలా!' అని పిలిచి బలవంతముగ కవేరుడు లోనికి గొనివచ్చెను.

చిత్రవింద

ఏమి విలక్షణపువను లీ సుకుమారసఖివి?

చారుశీల

అపుడు నీతలెనే నీలావృత్తాంత మెరుగని నాతో కులపతి యిట్లనియె. సహ్యాద్రిసానువులపై నేను మొదట నీపసికూనను చూచినపుడు శరీరమంతయు పసపుపూవులచే కప్పబడి నీలాలరాశివంటి తలమాత్రము స్ఫుటముగా కనుపించెను. అంతట 'నీలా' అని పిలుచుకొంటిని. ఆనీలయే నేడు నాకు మరల దొరకినది.

చిత్రవింద

ఈ విచిత్ర మెట్లు పరిణమించినది ?

చారుశీల

తర్వాత నాలుగుదినములవరకు అతికఠోరముగ నూర్పులవిడుచుచు తుద కీ నాటికి నిరామయమయినది.

చిత్రవింద

ఒక్క సంవత్సరములో కావేరి యెంత యెదిగినది? కల్పవృక్షముల నీడలలో వర్ధిల్లువారికైన నింతకాంతి కలదా చారుశీలా? ఆశ్రమము ప్రవేశించుచుండగా నింతకు మునుపే శోకవిహ్వల మగు నామెముఖమును

చూచితిని. ఈమె సౌందర్యము మానవసంసారములం దగమ్యమయినట్లు గనపడుచున్నవి.

పారుశీల

నిజమే పలికితివి. కులపతి యొక్కనాడు తన దివ్యపరిభావంబుచే నీమె నదీకన్యయని గ్రహించె. ఎఱుగుదువా సహ్యాద్రియం దతిరమణీయమగు నికుంజ మున్న దని?

చిత్రవింద

అదేనా, దేవీపంజర మని చెప్పకొందురు?

పారుశీల

అవును. ఆ నికుంజమున మరల కావేరి యేనా డడుగుపెట్టునో ఆక్షణమే గంభీరనిర్ఘోషముతో నదీరూప మును దాల్చి విశాలదక్షిణాపథమునందలి పల్లీపట్టణము లందును, అరణ్యమునందును, లీలోద్యానములందును, కేళీమనోజ్ఞముగ సంచరించుచు తుదకు సాగరస్వామి సన్నిధిని శాశ్వతసుఖము ననుభవించునట.

చిత్రవింద

ఎంత చిత్రము!

చారుశీల

చిత్రికే యింతచిత్రముగానున్న నా సంగతి యేమి? ఆనాడే కులపతి "ఏమివచ్చిననుసరే, నాతనయను ఆ పర్వతప్రాంతములకు పోనీయక కనిపెట్టి యుండవలెను" అని శాసించెను.

చిత్రవింద

తనపుత్రికపై కవేరుని మమకారము ప్రసిద్ధము కదా! ఆమె యానందమునకే నిరోధ మెందుకు కల్పించెను?

చారుశీల

పుత్రీమోహాతిశయమే ఆతని శాసనమునకు కారణము. శుభముహూర్తమున తానే యామెను మంగళస్నానములతో ఒప్పగించి రావలయునని కులపతి వాంఛ.

చిత్రవింద

దేవతలను ముహూర్తములచే బంధింప శక్యమగునా?

చారుశీల

అవునవును. ఆనాటినుండియు నాకు కావేరిముఖ దర్శనము భయమును విస్మయమును గొలుపుచున్నది. ఎంత ఆలస్యమయినది? నీ విక కుటీరమున కేగి యభిజనుల సందర్శింపకున్న భావ్యముకాదు. పద పోదము.

చిత్రివింద

ఈ నదీసుందరికిని మన యాశ్రమమునకును ఏటి ఋణానుబంధమో కదా?

---

మూడవరంగము.



(కావేరి వ్యాకులపాటుతో శీఘ్రగమనముతో ప్రవేశించును)

కావేరి

చారుశీలా! చారుశీలా! అప్పుడే వెళ్ళిపోయి నదే, నా బాల్యసఖి చిత్రివింద వచ్చిన దని యా బాల

కుడు చెప్పగా విని వచ్చితిని. లేకున్న నింకను ఆలస్యము చేసియుందును.

ఏమో యీనాడు నాతీరంతయు వింతవైఖరి నొందుచున్నది. ఎన్నాళ్ళీవేదన ? నేటితో నంత మొందు నంత తీవ్రముగా నున్నది. ఈసన్ననిశరీర మెంతబరు వని మోయగలదు. తరులతారణీయమైన యీపు ణ్యాశ్రమమున పంజరశుకివలె వేడియూర్పులతో, వియోగవేదనలతో ప్రొద్దుపుచ్చుచున్నాను. పాప మాప్రియసఖి చారుశీల యెంతో విన్నాణముగా నా శరీరముపై నలంకారములన్నియు దిద్దినది. పూవుల న్నిటిలో పొందికగలవి కొన్ని యేరి చెవికొనల దగిలించి నది. "నా హృదయసరోజము వాడి యున్నది. నా శరీరమున కీవాడనిపూవు లెందుకోయీ?" యం టిని. "సహవాసముచే నీహృదయమును మరల తల యెత్తునని" అని చమత్కరించెను. ఈ యాశ్రమ జనము నాకు పంచియిచ్చిన యనురాగమునకు బదు లుగా నొకపరాగలేశమయినను యీయ లేకుంటిని. ఏయతిదూరసీమనుండి నన్ను గొనితెచ్చి పెంచిరో నా జననీజనకులు ! ఆసౌభాగ్యసీమపై నా హృదయమునం

దెంతయాకాంక్ష బయలుదేరినది? ఆ జన్మాంతరసౌహృదయమునకయి నా యవయవము లన్నియు శ్రావణమేఘములను గాంచిన పూలరేకులవలె సంచలించుచున్నవి.

ఆశ్రమదేవతా! నీవైన నావారికి నన్నొప్పజెప్పుము. లేదా యీ యభాగ్యురాలిని నీ మేలిముసుగులలో దాచి మాయముచేయుము.

(అగస్త్యుడు ప్రవేశించును.)

అగస్త్యుడు

(కావేరిని సమీపించి)

సుకుమారీ! యీ వయస్సునకే యింతదుఃఖమా!

(కావేరి చకితయై వెనుకకు తగ్గును)

వయస్వినీ! భీతిల్లకుము. నేను నీ కాప్తుడను. రత్నగిరినుండి పయోధికూలమువరకు శోకార్తు లందఱును నీ కాప్తులే. దుఃఖదేవత యీలోకమున నొకసంసార మేర్పఱచుకొనినది. మన మిరువురము ఆమె సంతానమే.

కావేరి

దేవతలార! నన్నేల మాయముచేయరు?

అగస్త్యుడు

నే నావంకనుండి వచ్చుచు నీ కడసారిమాట లాలకించితిని. ఈ యాశ్రిమలక్ష్మియే నీ యాలాపములు విని న న్నిచోటికి పంపినది. నావా రని యంటివే వా రెవరు?

కావేరి

నిస్సీమమైన యీ విశ్వమందు ఏ చందనతరుచ్ఛాయలనో వారినివాస మున్నడి. అక్కడకూడ చీకటి వెలుతురు లున్నవి.

అగస్త్యుడు

ఏదైన గురుతు చెప్పవా?

కావేరి

ఆయభిరామప్రదేశమునందలి పుష్పములసౌందర్యమును నాహృదయము మరువలేదు. అచ్చటివినీలాకాశవీధులందు నామనస్సు యథేచ్ఛముగ సంచరింపగలదు. దాని నామాక్షరములు మాత్రము నా నాలుకకు రావు.

అగస్త్యుడు

వేదనావిధురములగు నీయింద్రియములనొకసారి మరపించి అచ్చటి పరిమళములను అచ్చటి యాలాపములను స్మరింపలేవా?

కావేరి

ఆ ప్రయత్నముల చేతనే నాప్రాణములు శోషిల్లి పోయినవి.

అగస్త్యుడు

మరచియైన పోలేవా?

కావేరి

ఎన్నిసారు లని చెప్పను. నా ప్రియసఖులు చూపు ఆదరాతిశయమువల్లను నా జననీజనకుల వాత్సల్యము వల్లను అంతయు మరచియున్న ప్రశాంతవేళలందు ఏ పూవుచాటుననుండియో ఏ మృగాలాపమునుండియో ఏ యాకాశవీధినుండియో ఏ వెదురుపొదనుండియో నా కీయార్తిస్వరము వినిపించి యీ తనువునంతయు నుజ్జ్వాత లూగించును. ఈ విశ్వములోని వస్తురాశి

యందు ఒక బాలతృణాంకురము సైతము నను మరచి పోనీయదు.

అ గ స్త్యు డు

కవేరదంపతులు యనురాగముచేనైన శాంతిం పని యీయీ వేదన ఎట్టిదో కదా ?

కా వే రి

ఆకాశవీధులనుండి నే నీ యాశ్రమభూములపై వ్రాలినప్పటినుండియు కులపతియును, నాతల్లియును నా ఆకాశమును నా కర్పింప ప్రయత్నించేవారు. వారే నాభాగ్యదేవతలు. ఎంతతలపోసినను వారి ప్రేమయందు కొరంతయే కనుపించదు. నాహృదయశల్యమును తీసి కోవలసిదానను నేనే.

అ గ స్త్యు డు

కవేరపుత్రీ ! ఇదియంతయు మతిభ్రమ కాదు గదా.

కా వే రి

అవును. నామాటల కంతకన్న అర్థము లేదుకా

బోలు. ఈ భ్రాంతిమాన్పుటకే చారుశీల యెన్నిసారులు "నీలా! నీ యాలోచన యెక్కువైనది. కొంచెమునవ్వుట, కొంచెము కోపించుట నేర్చుకొనలేవా!" అనియనలేదు?

అగస్త్యుడు

సత్యమే! లికిసగ భాగ్యశీల.

కావేరి

సత్యమేనా? సత్యమేనా? ఈయభాగ్యురాలి కిక కోరదగినది లేదా?

అగస్త్యుడు

లేకేమి! ఈ యశేషభూవలయమందలి రమ్యవస్తువు లన్నియు నీవు కాంక్షింపదగినవే. నీహృదయమం దెచ్చటనో మణగియున్నదుఃఖమును నీలిముసుగువలె మడతలు విప్పి యీప్రపంచముపై పరచికొంటివి. నీకన్నులకగపడు శ్యామలాకాశమునకును ఈ యాకాశమునకును పోలిక లేదు. మధ్య నొక తెర వ్రేలియున్నది. అది నీచేతులతో లేవ నెత్తుము. నామాట వినుము.

కావేరి

(సంభ్రమముతో)

నీమాటలతో నాహృదయము శాంతించినది! నేను నీ కాప్తుడ నంటివికదా! నిజమేనా? కావేరికరుణాలాపము లింకను కొంతసే పోపికతో వినఁగోరుదువా?

అగస్త్యుఁడు

జన్మ జన్మాంతరములకైన నీ కథామృతము నాకు విసువు పుట్టింపదు. నీబాధావిముక్తికై యేదైన యుపాయము తోఁచెనా?

కావేరి

చూచితివా ఆసహ్యాద్రిశిఖరపంక్తిని? ఎంత అందమైన పర్వతములు.

అగస్త్యుఁడు

ఈసానువుల సౌందర్యము నెందరెందరో వర్ణింపగా వినియుంటిని. అచ్చటి తరులతాఫలకుసుమరమణీయములగు నికుంజముల నొకసారి చూచిరావలయు నని నా కభిలాష.

కా వే రి

నాయభీష్టము నదియే. ఎఱుగుదువా ఆపర్వతము లెంతదూరమున నున్నవో ?

అ గ స్త్యు డు

సంధ్యావిహారములం దచ్చటికి పోయి రావచ్చును. అంతెగా దూరము లేదు.

కా వే రి

అట్లైన నాజన్మస్థానము అంతదూరము కాదు.

అ గ స్త్యు డు

ఏమంటివి! సహ్యాద్రి నీజన్మస్థానమా? ఏమి విలక్షణపు హాస్య మిది?

కా వే రి

అగస్త్యా ! నాకథయంతయు ముగియవచ్చినది. కడపటి వృత్తాంతము వినుము. ఆపర్వతములే నాహృదయమునందపార వేదనను మేల్కొల్పినవి. అదియే నన్న

పూర్వప్రేమతో “రా! ర”మ్మని నిరంతరమును పిలుపనం పుచు నిశ్చలముగ నేటివరకును దూరముననే నిలిచియున్నవి. పొద్దుపొడిచిన మొదటిగడియలలో స్నానమాడ నాశ్రమద్వారములనుండి వానిపై చూడ్కులు నిగిడ్చినపుడు రెక్కలువచ్చినపక్షులవలె నాప్రాణములన్నియు నా నల్లనికొండలపై తేలిపోవును. ఆప్రాంతముల కొకసారి నన్ను గొంపోదువా?

అగస్త్యుడు

కావేరి! ఇంతమనోవేదనతో నిన్నినాళ్ళెట్లూరకుంటివి? ఇంతమాత్రమున సమసిపోవునీదుఃఖమును నిర్లక్ష్యముగా నిన్నినాళ్లేల వర్ధిల నిచ్చితివి? ఆనందముగా గడపదగిన నీనవయౌవనము నేలయింతసంతాపపెట్టితివి?

కావేరి

నావారందరు నాకడ్డము వచ్చిరి.

అగస్త్యుడు

పోవల దని శాసించిరా?

## కావేరి

ఏదో రహస్యశాసన ముండెనేమో! కాని నా నెచ్చెలులు, నా తలిదండ్రులు, నాకు కావలసినవా రందరును వారించి ఏనాటికానాడు నాకోరికత్రోసిపుచ్చి నా కేదియు దెలుపలేదు. తుదకీ రహస్యవృత్తము నాకీ ప్రపంచమునందు జీవనాశ్రయమైనది. నా వెంటవత్తువా ఆపర్వతప్రాంతములకు ?

## అగస్త్యుడు

ఈయనంతసృష్టియందే యజ్ఞాతభాగములకైనను శ్యామలములగు నీ చేలాంచలముల కనులార గాంచుచు రాగలను. నేటిసాయంత్రమే మనప్రయాణము.

కావేరీ! నీ మోహనమూర్తికి ఉపాయనముగా నీ పుష్పమును స్వీకరింపుము. (అని తనయుత్తరీయము నుండి పూవును తీసియిచ్చును.) ఇది నాచేతులార నీరు బోసి పెంచిన తీవయిల్లాలి తొలికాన్పు. నీ సావాస మును కొంత అనుభవింపనిమ్ము.

కావేరి

అగస్త్యా! ఈ పూజాద్రవ్యమును నాతలపై ధరించి ధన్యనయ్యెదను. నేను నీ కొఱకు మందారమును కోసియిత్తును.

(అని పూవును కోయబోయి కొమ్మ అందక కాలు జారి యగస్త్యునిచేతులలో వ్రాలిపోవును. అగస్త్యుడు చెక్కిలి ముద్దాడును.)

(లోపలనుండి)

నీలా! నీలా!

---

## నాలుగవ రంగము.



(అగస్త్యుని సహాధ్యాయుడగు సావర్ణి ప్రవేశించి కావేరి యగస్త్యునిచేతులలో వ్రాలియుండుటను చూచి వెనుకకు తగ్గును. కావేరి నిష్క్రమించును.)

(సావర్ణి ప్రవేశము.)

అగస్త్యుడు

ఈ యాశ్రమమున బాలహరిణములు సైత మంత భయపడవే, నీ వేల చకితుడవైతివి?

సావర్ణి

నిజ మిది యాశ్రమమే. ఈ ముహూర్తమున మాత్రము అంతఃపురమా ఆశ్రమమా యని విచారింప వలసివచ్చినది.

అగస్త్యుడు

ఆశ్రమములో అంతఃపురము లుండునా?

సా వ త్రి

ఓహో! నీ వుపన్యసింపవలసినవార్త లనేకము లున్నట్లున్నవి. కానీ చెవియొగ్గి వినియెదను. (కొంచెము సమీపించి) కులపతిజీవనసర్వస్వమగు కావేరియెడల ననార్యుడవై యీ యపచార మేల చేసితివి?

అ గ స్త్యు డు

ప్రేమనేత.

సా వ త్రి

అది యెటువంటిది?

అ గ స్త్యు డు

నా హృదయకటాహములన్నియు నామె ప్రేమామృతముచే నేడు తెగిపోయినవి. నేటితో నేను విముక్తుడ నైతిని.

సా వ త్రి

చిన్ననాటనుండియు నిన్నెఱుగుదును. అప్పటిచేష్టలన్నియు నీ పర్యవసానమునే సూచించినవి కాబోలు!

అగస్త్యుడు

అవును. చిరకాలమునుండి, చిరజన్మములనుండి యీ యావేదన నా హృదయము నావేశించి, నా యాహారవిహారములందు, విద్యావ్యాసంగములందు నా చిత్తశాంతి నపహరించినది. ఇంతవట్టు నిజమే, కావేరియే నాయాశాఫలము.

సావర్ణి

ఈ యాశ్రమవాటికలందు విలాసార్థమై నీవు పెంచిన పూలతోటలందు నీ యుత్సాహమునకు కారణము రమణీశృంగారమేనా?

అగస్త్యుడు

ఇన్నాళ్ళనుండియు నీవు నాకు పరమాప్తుడవను కొంటిని. ఇంతదూరస్థునివలె ప్రసంగించెద వేమి?

సావర్ణి

ఈకావేరియుదంతము న న్నెంతో దూరమునకు గొనిపోయినది. కామినీకళంకితములైన యీ సంసార

బంధములపై నీ కెట్లు మమకారము కుదిరినది? ముని వృత్తి కిది మాలిన్యమని నీ వొప్పుకొనవా?

అగస్త్యుడు

తాపసు లంత పరిశుద్ధులా? వారి కీలోకమున బంధములే లేవా?

సావర్ణి

శతసహస్రము లున్నవి. లేకున్న నీతపశ్చర్య మెందుకు? ఈ కఠోరవ్రతము లెందుకు?

అగస్త్యుడు

కాంతాసంబంధమా శతసహస్రములలో చేరదు కాబోలు!

సావర్ణి

కామినీకాంచనములను బ్రహ్మచర్యవ్రతసమయములందే నిర్జించి యంతకన్న బలవద్విరోధులను జయించుటకై! ముముక్షువులు తపోవృత్తి నభిలషింతురు?

అగస్త్యుడు

కీర్తియనునది కాంత. ముక్తియనునది కాంత. ఈ

చతుర్దశభువనములకును అధిష్ఠానదైవము కాంత. ఆమె యీ సమస్తసృష్టిజాలమును తనచీరచెఱగుల చాటున దాచి రక్షించుచున్నది.

సావర్ణి

కీర్తికాంతకును, కులపతిపుత్రికయగు కావేరీకాంతకును ఎంత సామ్య మున్నది?

అగస్త్యుడు

నాప్రేమకును, నీవు నా కారోపించిన క్షుద్రకామనమునకును ఎంత సామ్య మున్నదో అంత.

సావర్ణి

నీహృదయమునందీ యారాటము నింకను స్ఫుటముగ వర్ణింపగలవేమో చూడుము. నీధోరణియంతయు నయోమయముగ నున్నది.

అగస్త్యుడు

అది అనుభవైకవేద్యము.

సావిత్రి

పోనిమ్ము. నీసాధనక్రమము విపరీతముగా నున్నదికదా! అగస్త్య నీయుపాస్యదైవముకూడ యే యసంభావితరూపమునో, యే యశ్రుతిపూర్వమగు నామమునో తాల్చియున్నది కానోపును. నీ వారాధించు దైవ మెట్టిది?

అగస్త్యుడు

రసదేవత. ఆమెకు రసమయి, ఆనందమయి యని రెండే పేరులు.

సావిత్రి

నీ వీలోకమున రసదేవతాసామ్రాజ్యమును నిర్మింప నెంచితి వన్నమాట!

అగస్త్యుడు

ఈ లోకమును మిగిలిన పదుమూడులోకములును ఆమె రాజ్యములోనివే.

సావిత్రి

ఈ యపోహాలన్నియు నెప్పటికిని విడువనేర వన్నమాట!

అగస్త్యుడు

సావర్ణి ! ఇంత నిష్ఠురముగ నెందుకు పరిహాసము చేసెదవు? నీమిత్రుని హృదయక్లేశమును తగ్గింపగల మాట నొకటైన నాడకపోతివి.

సావర్ణి

కావేరీస్నేహమును నిర్మూలింపుము. ఆశ్రమ విరుద్ధమగు నీ చిత్తవృత్తిని మరల్చుకొనుము. లేకున్న నీకారణముగ కులపతివిశుద్ధజీవనమునకు కళంకము రాకమానదు.

అగస్త్యుడు

కవేరపుత్రికపై యనురాగము తెచ్చిపెట్టుకొనునది కాదు. విశ్వమంతయు పాలించుతల్లియే నాయందా రాగోదయమును మేల్కొల్పినది. ఆమెయే దానిని నిర్మూలింప సమర్థురాలు.

సావర్ణి

చిరకాలసాహచర్యముచే నార్జించిన మైత్రివలన నింకొకసారి చెప్పెదను విను. నా హితవాక్యములు మధు

రముగ లేవనిమాత్రము నిందింపకుము. కావేరీవృత్తాంతము నీ వవశ్యము మరచిపోవలసినదే.

అగస్త్యుడు

నా యాత్రికథను సావధానముగ నాలింపుము. నేడు నా హృదయము అనన్యతుల్యమగు తేజోరాశిచే నిబిడమైయున్నది. ఈ నిండుదినమున నా నిర్వేదభార మంతయు నాప్తుడవగు నీసన్నిధానమున నివేదించుకోవలయు ననుకొంటిని. విశ్రాంతి యొసగని నా మనస్తాపమును తగ్గించుకోదలచితిని. కాని యెన్నడును లేని కాఠిన్యమును వహించి నన్ను వేధించుచున్నావు.

సావర్ణి

అంతమాత్రమున నీ తోడిబాంధవ్యము వదలుకొనలేను. నీ శ్రేయోభిలాషయే నా వాక్కుల కింత కాఠిన్యము నారోపించినది.

అగస్త్యుడు

ఎన్నడో నే నీయాశ్రమమునకు మొదట వచ్చినపుడు అస్పష్టమగు లీలామానుషవిగ్రహ మొకటి

చంద్రికాయామినులందు కుసుమితోద్యానములందు తనశీతలమగు దృష్టిని నాపై బరపుచుండెను. ఆనాటి నుండియు నా సకలేంద్రియములును ఆ విచిత్రానుభవమునకై యెదురుచూచినవి. జీవనమార్గమందు నే నేర్పరచుకొనిన లక్ష్యములన్నియు నా యదృశ్యమూర్తి యాగమనముచే నదృశ్యములయ్యెను. నా కులము, శీలము, మర్యాద తుదకు నా స్వభావమంతయు ఉదయభానునివలె క్షణక్షణము నొక క్రొత్తరూపమును దాల్చి సంపూర్ణముగ మాఱిపోయినది.

సావర్ణి

ఈభేదమును నీ వెన్నడును తెలిసి తర్కించుకొనలేదా ?

అగస్త్యుడు

నాయనుభవము నంతయు నొక్కముఖమునకు దెచ్చుకొని నాలో నే నన్వయించుకొంటిని. ఈ యాశ్రమకవాటములను తెరచి యనంతమగు విశ్వవీథిసంచారమునకై నాజీవనలక్ష్మియె నన్నాహ్వానించిన దనుకొంటిని. ఈయాశ్రమము నాస్వేచ్ఛాజీవనమునకు చాలదు.

ంకే యిచ్చటి నియమములను, బంధములను వద
ంకొనుచున్నాను. నా యింద్రియములతో వైరము
ంచి వానిని క్లేశపెట్టజాలను. వానిసాహాయ్యమున
ముపాస్యదైవము నన్వేషింతును.

సా వ ర్ణి

వయస్యా! నాకెంత ఖేదమును తెచ్చిపెట్టితివి?
పరీత వృత్తాంత మెట్టి పరిణతి నొందునో కదా!

అ గ స్త్యు డు

సావర్ణి! నిన్నుగ్గించి యడుగుచున్నాను. నన్నా
ంపుము.

సా వ ర్ణి

ఎల్లప్పుడును నీ శ్రేయస్సు నే కాంక్షింతును.

అ గ స్త్యు డు

నీతో నొకమాట చెప్ప మరచితిని.

సా వ ర్ణి

ఈశుష్కవాక్యములతో నామనసు విఱిగిపోయి
వెనుకటివలె నేదైన వార్త చెప్పుము.

అగస్త్యుడు

కాదు. నేనీసాయంకాలము కావేరితో సహ్యాద్రికి వెళ్లివచ్చెదను.

సావర్ణి

(విసువుతో) అచ్చట నేమున్నది?

అగస్త్యుడు

కావేరికి చూడవలెనని యున్నది.

సావర్ణి

(మఱింత విముఖుడై) నే పోయివచ్చెదను.

(నిష్క్రమించును)

అగస్త్యుడు

నాయారాటము కొంత శాంతించినది.

(నిష్క్రమించును)

# ఐదవ రంగము



[కావేరి ప్రవేశము.]

విశ్వపతీ! ఎన్నాళ్ళని యాలసించెదవు ? నీకై యీ హతభాగిని పదునెనిమిదేండ్లకనిపెట్టుకొనియున్నది. బాలసూర్యునివలె పరిఫుల్లమగు రథమునకు సారథివై వచ్చి యీ యాశ్రమసంతానము నెన్నడు గౌరవించెదవు? "అదిగో వచ్చుచున్నాడు. అవే ఆతని రథనేమిధ్వానములు." అని కర్ణరసాయనముగా నెన్నడు విందును? సంధ్యాకామిని! చెంగావిచీర కొంగులతో నలసట వాపుకొనుచు, అస్తమయవేళలందా నీవువచ్చునది? లేక, నీ యుత్తరీయము నుదయవాయువులలో తరికెగా నవరించుకొనుచు నానాప్రసూన[illegible] గంధిలములగు తొలిగడియలందే రాదలంచితివా? ఈ రెండువేళలను పాటింపక ప్రళయనిశీధమం దొంటరివై తేజస్వివై, తరులతాపల్లవచ్ఛాయలు వెలిగించుచు నడచివచ్చెదవా? ఎన్నడో లీలగా కనుపించిన నీరూపసౌభాగ్యమునకై కడచిపోయిన దివారాత్రములన్నియు దాటి ఆ మొదటిసాక్షాత్కారమును స్మరింప ప్రయత్నించితిని. అంతయు విఫలము కావలసినదేనా ?—

కాదు. కానేరదు. నీ పీ నాడేవచ్చెదవని నేనెఱుగుదును. అగస్త్యకుమారుని యనురాగమే నా కీవిధమంతయు దెలిపినది. అవును నీవే నాయొద్ద కతని నంపితివి ? నాయింద్రియములన్నియు నీతోడి సౌఖ్యమునే రూచించుచున్నవి. నాప్రాణములు ఱెక్కలు వచ్చిన పక్షులవలె నీ సందర్శమునకై యెగిరిపోవున ట్లున్నవి.

ఆవచ్చుచున్నది నాచెలికత్తెలేనా? చిత్రవింద యెంత యుల్లాసముతో మాటలాడుచు వచ్చుచున్నది!

చా రు శీ ల

నీలా! నీకై యెంత వెదకివచ్చితిమి! ఎందుకని మాసాంగత్యము నిట్లు త్రోసిపుచ్చుచున్నావు?

చి త్ర విం ద

వేటకాని తప్పించుకొని తిరుగు లేడిపిల్లవలె వృక్షమునుండి వృక్షమునకు నికుంజమునుండి నికుంజమునకు కావేరి సంచరించుచున్నది. మే మే మపచారమొనరించితిమని నీవి ట్లొనర్చితివి!

కా వే రి

మీరు వలదన్నను నే నీవేళ మీ వెంటవత్తును. నాకంత సంతోషముగా నున్నది.

చారుశీల

కావేరీ! నీకొక శుభవార్త చెప్పవచ్చితిమి ?

కావేరి

ఏమని ?

చారుశీల

రేపు నీజన్మదినము. ఆశుభసమయమును పండువుగా జరుపవలయునని కోరి కులపతి వలయుసన్నాహమంతయు సేకరింప మాకాజ్ఞయిచ్చెను.

చిత్రవింద

నిలకు వలసిన శరీరాలంకారములన్నియు నేనే సమకూర్చెదను. సన్నని వలువలతో పూవులతో రాణివాసములందలి రమణీమణులవలె నలంకరించెదను. ఆశ్రమదేవతకు కావేరిపై నెంత యనురాగమున్నదో రేపుకదా తెలియును. కావేరి స్వయముగా నీరార్చి పెంచిన మాలతి యేమాత్రము పూలు పూయునో చూతము.

చారుశీల

చక్కని పెండ్లికూతురివలె నేనును అలంకరింపవలె ననుకొంటిని.

చిత్రపింద

అట్లయిన అనుకూలుడగు వరునికూడ విచారించితిరా ?

చారుశీల

వరునితోప నేమున్నది? ఏ చక్రవర్తియో కుల పతిసందర్శనమునకై వచ్చి యామెతో తన యంతఃపుర మున కెగిరిపోవును.

కావేరి

(అన్యమతితో) అప్పుడు మిమ్మునుకూడ నా వెంట కొనిపోవుదునులే. (కొంచెము నిదానించి) వేళ యైనట్లున్నది.

చారుశీల

ఏ వేళ ?

కావేరి

సూర్యు డస్తమించువేళ యైన ట్లున్నది.

చిత్రపింద

చక్రవర్తి వచ్చునా లేదా యనియా విచారించు చున్నావు.

చారుశీల

కాదు. కావేరి మరల నేదో మనకు తెలియని విచారములో మునిగి చరించి ఏదివ్యమూర్తిని ధ్యానించుచున్నదో.

కావేరి

నాగోడునుగూర్చి చింతించిన మీకంత భీతి యెందుకు ? ఏమియు నమంగళము జరుగదు. నాధ్యానమున కేనిలే. కాని, నీ వంటివే ఆదివ్యమూర్తి నాకు సాక్షాత్కరించెను.

చిత్రవింద

నిజముగానా?

కావేరి

అమృతము నతిశయించిన మాధుర్యమును వెదజల్లు వజ్రఖండములవలె శక్తివంతములగునతని వాక్కులు నాహృదయమం దెన్నడును వినియెఱుగని యానందగానమును మేలుకొల్పినవి. చూడని ప్రదేశములు కన్నుల గట్టిన ట్లయ్యెను. మరచిన మధురాలాపములు మరల జ్ఞాపకమునకువచ్చెను. ఎన్నిసారులో ప్రియత్నించి పలుకనేరని నా యూహాలన్నియు నతడు లలిత

ములగు మాటలతో పొందికగా నిమిడ్చి చెప్పెను. అంత పరిభాపూర్ణములయ్యెను, చిత్రా! నీ యాలాపముల వలెనే అతని యాలాపములును మధురములై యుండెను. అతని సాంగత్యముచేసినప్పటినుండియు, నాకు రానున్న యుదంతమెల్ల ముందుగా గోచరించునట్లున్నది. ఈ నాతలంపులు సత్యములైనచో నీనాడె నా దుఃఖము మాయమగును. భువనము లన్నిటిని నల్లుకొనిన నా యాశాలత తప్పక నేడే పుష్పించును. నిశ్చయము.

చారుశీల

నీ మాటలు చిత్రముగా నున్నవి.

చిత్రవింద

కావేరి నెఱుగని దానివలె నీవేల విన్నబోయెదవు? ఱేపటి పండుగముచ్చట లేవైన చెప్పుము.

చారుశీల

నీలా! కులపతియభీష్టమును సలక్షణముగ నెరవేర్పనెంచితివా? లేదా?

కావేరి

కులపతికోరిక నాకోరిక లన్నియును నెరవేర్తును. నీకై యెవరో వేచియున్నట్లున్నది. అటుచూడుము.

చారుశీల

మునికుమారుడగు సావర్ణియా! నే నొకింత మాట్లాడివచ్చెదను. చిత్రా! కావేరితో వెళ్లరమ్ము.

(చిత్ర, కావేరి నిష్క్రమింతురు)

సావర్ణి

చారుశీలా! నీతో నొకమాట.

చారుశీల

మునిపుత్రునికి వందనములు.

సావర్ణి

ఏమైన విశేషవార్త లున్నవా?

చారుశీల

ఏమున్నది? రేపు కావేరి పుట్టినదినము. కులపతి యాజ్ఞ శిరసావహించి యందుకు వలయుసామగ్రి సేకరించుచున్నాను. కాని నాయుత్సాహము క్షీణించినది.

సావర్ణి

కారణము? (చారుశీల సందేహించును.)— సంశ

యింపకుము. నా కీవార్త ముఖ్యముగ చెప్పదగినది. ఆలసింపకుము.

చారుశీల

కావేరి మిగుల నస్వస్థతగా నున్నట్లున్నది. ఎవరో దివ్యమూర్తి యనురాగముతో దన్ను బలుకరించెనని చెప్పినది. ఆతని సందర్శించినంతనే తనకోరిక లన్నియు నేడే ఫలించునని చెప్పినది. ఏమి కోరికలో? ఏమి ఫలించుటయో? అంతయు వైష్ణవమాయవలె నున్నది. ఆ దివ్యమూర్తి యెవరో?

సావర్ణి

మానవతుల మనోవృత్తములు మాబోంట్ల కెట్లు తెలిసికొనవచ్చును? దానికేమి. నాకీవిషయ మెఱుంగ జెప్పుము. మీసఖి సహ్యాద్రిపర్వతప్రాంతముల కేగ గూడదని ఏదైన శాసన మున్నదా యేమి?

చారుశీల

అది కడు రహస్యము.

సావర్ణి

అజ్ఞానముచే నట్లనుచున్నావు. నేటితో నీరహ

స్యము తన యంతర్దశమల నన్నింటిని విప్ప నిండార పుష్పించి యన్నిదిక్కులను వ్యాపించును. నన్నుకారణ ముమాత్ర మడుగవద్దు. అంతయు నివేదింపుము.

చా రు శీ ల

కావేరి యొకనదీకాంత. సహ్యాద్రిపర్వతములం దలి దేవీపంజర మను నికుంజమున నామె కాలువెట్టిన తోడనే నదీరూపము దాల్చునట. మమకారముచే కావేరి నింకను కొన్నినాళ్ళయాశ్రమవాటియం దుంచ వలయునని కులపతి రహస్యము శాసించినమాట నిజమే.

సా వ ర్ణి

నే నిక పోయివచ్చెదను.



## ఆరవ రంగము.



### ఆశ్రమప్రాంతస్థలము- సంధ్యాకాలము.

(ఋషిబాలకులిరువురు పాడుచు బ్రవేశింతురు)

పూవుపాడితో పసుపుబూనుక
కావియిగురులకాంతు లద్దుక
తోవ లెటిగిన చరణములతో
రావె! సంధ్యాకామినీ!

ఉదయకన్యలు కలశములతో
పిదికి పంపిన యాలమందల
పొదుగులను క్షీరముల నింపితి
గదవె! సంధ్యాకామినీ!

పచ్చిమాలతి యాకుమడుపులు
గుచ్చివేసిన పూలదండలు
తెచ్చియుంచితి మొక్కమా రిటు
వచ్చిపో! సంధ్యాంగనా!

నల్లనల్లని కలువదండల
నెల్లదిశలను నిదుర నెలతలు

అల్లిపోవక మునుపె యమృతము
చల్లిపో! సంధ్యాంగనా!

ఎవరిపై నీవలపు నిలిపితి?
వెవరికై యీపారవశ్యము?
భువనభువనములెల్ల తిరిగెద
వవుర! సంధ్యాకామినీ!

ఉదయమున వెలిచీరచాటున
కొదమసంజలకావిముసుగున
పొదలుచుంది నీవొంటి తసేనా!
ఉదయసంధ్యాకామినీ!

"అరే యీయాశ్రమములో నందఱికన్న నెవరు మంచివారురా?"

"కులపతి."
"ఆయనతప్ప తక్కినవారిలో?"
"అగస్త్యుడు."
"సావర్ణిమాత్రము మంచివాడు కాదేమి?"
(నవ్వును)

"అత డెప్పుడు ముడుచుకొనికూర్చుండును, అదే మి పాపమో!"

"ప్రొద్దున నేను సమిధలకై పోయి యీ పని ముగియకమునుపే ప్రక్కనున్న దానిమ్మపండ్లను అందుకొనలేక కొమ్మలు వంచుచుంటిని. అగస్త్యుడా దారిగా బోవుచు నాకవి కోసి యిచ్చి, పలుకరించి, తన త్రోవను బోయెను. అంతట నవి యారగించుచు నక్కడ చదికిలబడితిని. ఇంతలో సావర్ణి సమీపించి నా చెవి మెలియబెట్టెను. ధూమశిఖవలె తలగిఱ్ఱున తిరిగిపోయినది. నోటినుండి సగమునమలిన దానిమ్మపండ్లరసము నెత్తురు బొట్టులవలె రాలినది."

"ఎన్నాళ్లనుండియో అతనికి తగిన శాస్తి చేయవలెనని నాకోరిక. కాని ఆయన యెదుటబడగానే నోటివెంట మాటరాదు."

"నీబదులు నేనే చేసితినిలే. మెల్లగా ధైర్యము తెచ్చుకొనియుంటినిగదా,— సావర్ణీ! పుట్టేపుట్టుటతోనే నీ వింత పెద్దవాడవైనావా? నీవుకూడ ఎప్పుడోఒకప్పుడు

చిన్నవాడవైయుండలేదా ? ఎప్పుడో ఒకప్పుడు నీవును పెద్దవాడవై యుండలేదా?—యనిన న న్నెట్లనగలడు? అందుకని ఏమియు తోచక మిత్తుచూచి పోయెను."

"అదిగో! ఆవచ్చునది సావర్ణియే. నీ మాటలు తప్పక వినియుండును. అతడు కన్నులతో విసగలడు. నీకు శిక్షతప్పదు."

సా వ త్రి

(సమీపించి)

మీకు అగస్త్యుడిప్పు డెచ్చట నున్నది తెలియునా?

బా ల కు లు

(ఇరువురును కలిసి)

ఆఁ చూపించెదము.

(నిష్క్రమింతురు.)



ఏ డ వ ర ం గ ము.



(పశ్చిమాభిముఖుఁడై యగస్త్య డొకవృక్షమూలమున నిలిచియుండును.)

సా వ ర్ణి

(ప్రవేశించి) నీ కొక శుభవార్త నెఱింగింప వచ్చితిని.

అ గ స్త్య డు

(సంభ్రమముతో) శుభవార్తయా ?

సా వ ర్ణి

అవును. సంతోషవార్త మాత్రము.

అ గ స్త్య డు

అది యెన్నఁడో త్యజించితిని. నాజీవనము ధన్య మగుమార్గమే నేనన్వేషించుచున్నాను. నాకు సంతోషముతో పని లేదు.

సా వ ర్ణి

అదియును చేకూరదు.

అగస్త్యుడు

ఎందువలన?

సావర్ణి

కావేరి నేటితో వస్తమించును గనుక. ఇతరారాధనము లన్నిటిని చాలించి, యేమూర్తిసన్నిధానమున నీఫలకుసుమపల్లవములన్నియు సమర్పించితివో, ఆమూర్తి నేడే నిన్ను విడనాడి పోవును.

అగస్త్యుడు

సావర్ణి! నీ వాక్యములు సుదూరమునుండి విన వచ్చు మేఘగర్జనములవలె వింతగా ధ్వనించుచున్నవి. నీమాటలయందలి యర్థమంతయు నాకు వినిపింపుము.

సావర్ణి

కావేరి మనుష్యకాంత కాదు. నదీకన్య. దైవవశమున నీ యాశ్రమవాటికయం దిన్నాళ్ళు పెరిగినది. అచిరముననే నీవు పోనున్న సహ్యాద్రియం దొక నికుంజమున్నది. ఆ ప్రదేశమున నడుగుబెట్టినతోడనే మనుష్యరూపమును విడనాడును. ఇక నీ వా నదీతరంగములను

ప్రేమింతువా ? సహ్యాద్రినుండి సాగరమువరకును ప్రవహించు నా మహావాహినియందు కావేరీహృదయము చ్చట నున్న దని పలుకరించెదవు ? నీ బాహులతలయం దిమిడియున్నమధురరూపము నీ భుజబంధములను త్రెంచివైచి దక్షిణాపథమంతయు వ్యాపింపగలదు. నీ ప్రేయసిపల్లవాధరము ఏ పూదోటలచెంత ప్రతిఫలించునో, నిబిడమగు నామె వక్షస్థలము ఏ యేకాంతసీమయందు మంద మందముగ లేచి వ్రాలుచుండునో, తీయని యామెయూరువు లే వెన్నెలరాత్రులందు నీకై సంచారముసేయునో యెఱుంగుదువు ? మాఱు పలుక వేమి?

అగస్త్యుడు

నాహృదయము శిథిలమైనది. సావర్ణీ ! నాత్రోవ నన్ను బోనిమ్ము ! (నిరుత్తరుడై యాలోచించును.)

సావర్ణి

అగస్త్యా ! ఆలోచింపుము. దీర్ఘముగ నాలోచింపుము. నే నేగుచున్నాను.

---

# ఎనిమిదవ రంగము.



## అగస్త్యుడు

నా జీవనయాత్రయం దీ దినము విశ్రాంతిసమయ మనుకొంటినిగదా! ఈనాడే దుర్గమములగు దేశాంతరములకు మరల బయలుదేరవలసినదేనా?

ఈసహ్యాద్రిప్రయాణమే లేకున్న నేమగునో? అట్లయిన కావేరి నాకేల బాంధవియగును? తన యభీష్టము నెఱవేఱునని యే మనుష్యుడ నగు నన్ను కామించినది. నా పుణ్యములు ఫలించుటకై, నా కాంక్షాగ్ని చల్లాఱుటకై యీప్రియ సమాగమము నాకు చాలును.

కావేరీ! ఏ రసావేశస్థితియందు విధాత నిన్ను నిర్మించెనో! పాట విశ్రమించిన కోకిల కుహూస్వరములచే నిబిడమైన యుద్యానమువలె, నీ యాకారము సంపూర్ణమై యున్నది. ఆ మోహనాకృతి, మేళవించిన వల్లకివలె, యెన్ని మధురాలాపములు పలుకలేమ?

ప్రేయసీ ! నీవు నదీకాంతవా ? ఇన్నాళ్లనుండియు రమణీయమగు రమణీరూపమున బంధింపబడియున్న నీవు విశ్వరూపమునుదాల్చి దక్షిణాపథమునందలి పల్లీ పట్టణ ప్రాంతముల విహరింతువో? నేనును ఆ మహారూపమును సందర్శించుటకే కుతూహలపడితిని. కానిమ్ము. ఈరాత్రి చేతులార నిన్ను పోగొట్టుకొందును. నీ రాకకై వేచి, నీ మంగళగానము సేయుటకై నెందఱు ధ్యాన దేవతలు యెందఱువనలక్ష్ములు ఉత్కంఠతతో నున్నారో ! నానిశ్చయము కుదిరినది. నిన్నుతప్పక సహ్యాద్రికి గొనిపోవుదును. నీవియోగము సహించి యుండుట కీరాత్రి జన్మజన్మముల మఱపురాని నీమూర్తి నవలోకించిన జాలును.

కావేరి వచ్చువేళ యైనది. ఇక పోవలయును కావేరి సాగరమునకు, నేను నిర్జనారణ్యములకు.

---

## తొ మ్మి ద వ రం గ ము.



(సహ్యాద్రి - చంద్రోదయము)

అ గ స్త్యు డు

మెల్లమెల్లగా నడుగువెట్టుము. దారియందలి నిమ్నోన్నతము లంతగా కనుపించుటలేదు. చంద్రికకును మసకును మధ్యగా నీయున్నతములగు సాలవృక్షములు వెల్లసిగోడవలె వెన్నెలల గుచ్ఛముసచ్చుచున్నవి.

కా వే రి

అదిగో ఆవైపున కేగుదము. అచ్చట నీడ లంత దట్టముగా లేవు. అవిరళచ్ఛాయలమధ్య బాలచంద్రుని బంగావిరంగులుపడి, వ్రాతపనిచేసిన చక్కని తివాచీల వలె నా ప్రాంతమున శాద్వలము లెంతతీరుగానున్నవి!

అ గ స్త్యు డు

అలవాటుపడని నీపాదము లీదూరభారముచే కందియుండును. ఒకగడియసేపీ శిలావేదికపై విశ్రమింతమా?

కా వే రి

మునిపుత్రిల సహవాసముచే నంతదూర మని పించలేదు. కాని నాకును కొంత సేదదీర్చుకొనవలెనని యున్నది.

(ఇరువురును విశ్రమింతురు - వెన్నెల లంతకం తకు విప్పారి యన్నివైపుల నల్లుకొనును.)

అ గ స్త్యు డు

చంద్రోదయముచే నీ పర్వతము లన్నియు తెర యెత్తిన ట్లొకక్షణములో ప్రత్యక్షమై యెట్టివేషమును దాల్చినవి! ఈ సుందరవస్తువు లన్నిటిలో నీ ముఖమం డల మొంతమూడదగియున్నది !

కా వే రి

అవధి యెఱుగనికాలమునం దేనాడును మాసిపోని యానందానుభూతిని నాకు సమకూర్చితివి. చెలికాడా! ని న్నేమని కీర్తింతును ?

అ గ స్త్యు డు

ప్రేయసీ! కావేరీ !

కావేరి (ఒంకిత చంచలయై)

ఏమి యాకంఠస్వరము!

అగస్త్యుడు

కావేరీ!

కావేరి

ఎంత మధురముగ నాహ్వానించితివి? నా నామాక్షరము లన్నిసారు లుచ్చరించితి వెందులకు? వానికతీతమగు సంశయ మేదియో నిన్ను వేధించుచున్నది. తప్పక నా కెఱింగింపుము.

అగస్త్యుడు

నీ నామాక్షరములయం దంత మాధుర్యమున్నది. నా యాహ్వానమున కాదు.

కావేరి

నీ విదివర కెన్నడును ఇంత భీరుడవు కాలేదు.

అగస్త్యుడు

అచిరముననే నీవు నన్నెడబాసి పోదువనుకో.

కావేరి

నా జీవనదాతవు నా జీవనపతివి అగు నిన్నా నే నెడబాయుట ?

అగస్త్యుడు

మాటవరుస కట్లనుకొనుము. నీ యదృష్టదేవత నిన్నెడబాపు ననుకొనుము.

కావేరి

లోకాలోకములందెవరును నన్నును నాప్రాణప్రియుని విడదీయజాలరు.

అగస్త్యుడు

ఒకవేళ.

కావేరి

నెచ్చెలీ! యేమని చెప్పుదును? నిశ్చయగము వియోగమే వచ్చుననుకొందును. అట్లైన నీలోకమునందున్నను, లోకాంతరమున కేగినను, ఈ శరీరముతో నున్నను, రూపాంతరమును స్వీకరించినను, బ్రహ్మాండమునంతయు చీల్చుకొని వచ్చి నీపాదములాశ్రయింతును. కామినీకాముకుల కాప్తుడగు నీచంద్రుడే నాకు సాక్షి.

అగస్త్యుడు

(కావేరిని కౌగిలించుకొని) కావేరీ! నీ యమృ

తాలాపము లాలించి చిరంజీవి నయ్యెదను. ఈనాడు నీ విచ్చిన యానందపాత్రి, నీవియోగము యుగయుగాంతరములు పట్టినను నన్ను పోషింపగలదు.

కావేరి

మాటలలో మరచిపోతిమి. సుధాలంకృతమగు ప్రాసాదమువలె మన కెదురుగా ఆకనుపించు సౌందర్యరాశి యేమిటి?

అగస్త్యుడు

అదియేనా దేవీపంజరము? (ధ్యానమగ్నుడై కొంతతడ వూరకుండును.)

కావేరి

ఇంకను అలసట తీరలేదా? ఇంకను విశ్రమింతమా? కొంతతడవు? మారు పలుక వేమి?

అగస్త్యుడు

నా కిక విశ్రాంతి యక్కర లేదు. అంతటి దురాశ నా కెందుకు?

కావేరి

నాప్రాణప్రియున కేదియో మరల వాటిల్లినది.

అగస్త్యుడు (దిగ్గున లేచి)

ప్రేయసీ! నాసంశయములన్నియు తీరినవి. నేను సంసిద్ధుడనై యున్నాను. పోదము రమ్ము. నిన్నాహ్వానించి చిరస్మరణీయమగు నొకక్షణకాలము నీ కాతిథ్యమిచ్చుటకై యేదేవియో యీ నికుంజమును నిర్మించినది. అతిదూరసీమలనుండి నీ కాహ్వానపత్రికలు తెచ్చి, మలయవాయువులు పర్ణపుటములందలి మర్మరధ్వనులతో చదివి చెప్పుచున్నవి! పోదము రమ్ము.

(ఇరువురును కొంతదూరము నడచి)

కావేరి

ఇచ్చటి పుష్పవాసన లెంత సాంద్రముగానున్నవి!

అగస్త్యుడు

వాడిపోయిన పూలవాసన లన్నియు వచ్చి యీ రమణీయకుంజమున విశ్రమించును కాబోలు.

కావేరి

ప్రాణప్రియా! నాశరీరమందలి ప్రతియణువును

అతివేగముగ తిరుగుచున్నది. శతకోటిఖండములై యీభూభాగమునందు చెదరిపోవునట్లున్నది. నా కాశ్రియ మిమ్ము.

(అగస్త్యుని చేయూతగా రెండడుగులు నడచి, నికుంజమున కాలుపెట్టి నిష్క్రమించును. అంతట ప్రచండమగు జలప్రపాతమువలె ధ్వని యగును. అగస్త్యుడు నిర్విణ్ణుడై నిలిచియుండును. లోపలనుండి "జీవనపతీ! ప్రతిసంవత్సరమును ఈదినము నీకై వేచియుందును." అని శ్రావ్యమగు కంఠధ్వని వినిపించును.)

అగస్త్యుడు

ఇప్పటి కివి నాప్రియురాలి కడసారిమాటలు.

(నిష్క్రమించును.)

(వనకన్యకలు, ఉద్యానదేవతలు, లతాకన్యలు చేరి పాడుదురు.)

కావేరి దేవేరియై వచ్చె నేడు
తరులతలార! పోదాము రారమ్మ!
పూవులు బూయరే! పూదీవెలార!
ఫలము లందీయరే! ఫలతరులార!

ఆరతు లెత్తవే! ఆరామదేవి!
పద్యాలు పాడవే! ఉద్యానలక్ష్మి!
మొగలిపూపొడితోడ ముగ్గులువెట్టి
జాజిమొగ్గలతోడ పూజలు వ్రాసి
గోరింటగుత్తులు తోరణాల్ గట్టి
పొరుగువారలతోడ పొద్దుపుచ్చేము
తరులతలార! పోదాము రారమ్ము!

పొలిమేరపొలములు పులకరింపంగ
దిక్కులన్నిటిలోన దిరుటదీరంగ
దేవతలందరు తేరిచూడంగ
కావేరి కరుణించి కదలి వచ్చేను
తరులతలార! పోదాము రారమ్ము!

వచ్చేటిదారిలో వరుసగా నిల్చి
పాలవెల్లులగట్టి పందిళ్లు తీర్చి
పిలిచి కావేరిని పలుకరించేము
పాపకర్మములెల్ల పారదోలేము
కావేరి దేవేరియైవచ్చె నేడు
తరులతలార! పోదాము రారమ్ము!

